నానందరసమే నాదబిందుకళా దర్శనానందరసమే విద్వాంసులు పనస్ఫూర్తి రూపాత్మాను భవముచే పరమానందంబునొంది సుఖంబుందురు.

శ్లో. అమృత విశదాం విభ్రాజం తీంగురోః కరణా వశాద జరమమృత
మాచిన్వానాం మహాః సుకృతైః దయాం| తచనుబగతామభ్యాసాది
ప్రయత్న సచూగతాం| పరశివకళా మంతః పశ్యన్నుం పేహి కృతా
ర్థతాం ॥౩౪॥

తా. ఓయిసాధకుడా! అమృతమువలె తెల్లగా ప్రకాశించుచున్న గురుకృపవలన అమృతమును స్రవించుచున్న మహాసుకృతముచే ప్రాప్తమగుచున్న సూక్ష్మదేహము దభ్యాసప్రాప్తమగు పరమశివకళను స్వహృదయమందు నిరీక్షించుచున్న వాడవై కృతార్థుడవుగమ్ము

శ్లో. రాచర్లలోపాఖ్యవిఖ్యాత రాజేశ్వర కవీశ్వరః| గీతగౌరీశ కావ్యేస్మిన్
పంచమం సర్గ మభ్యధాత్ ॥౫॥

తా. రాజేశ్వరపండితవిరచితమైన గీతాగౌరీశ కావ్యమందు పంచమసర్గము ముగిసెను.

## షష్ఠస్సర్గః

శ్లో. జ్ఞాత్వాత మధవిరక్తో యోగాసక్తత శ్శివం ధ్యాత్వా| తన్విభవం శ్రీ
గురవే బుధసురతరవే గురుః ప్రాహ ॥౩౫॥

తా. విరక్తుడగు యోగిగురుకృపచే స్వహృత్కమలమున శివసాక్షాత్కారమును జెంది యాపరమేశ్వరానందానుభవమును ప్రకటింపచేయుమ ప్రకాశించుచున్నాడు.

శంకరాభరణరాగేణగీయతే

గీ. ఉపరి పరిస్తృత విస్తృత చేలం ప్రవిలసిత సింహాసన మనిలోలం| భూ
త పతిజ్ఞ గదుద్భ్యాతి కృతేరాజతి యోగీన్నృప ఇవభోగీ ॥౧॥

తా. వస్త్రాభరణాలంకృత సింహాసనాధిష్టితుడగు పరమేశ్వరుని స్వహృదయమందు ధ్యానించుచు యోగిభోగియగు మహారాజువలెనే ప్రకాశించుచున్నాడు.

వహతి సజాహిత మహిత విభూతిం| పరివృత సకల మహాగ్రహ భీ
తిం ॥౨॥ భూత॥

తా. అట్టియోగి వేదహితమైనదియును మహాగ్రహనివారకమగు భస్మమును సర్వాంగంబుల ధరించుచున్నాడు.

జయతి దురాసద బలమరినగణాం నియమిత భూరిత పాంతర సుగణం ॥౩॥ భూత॥

తా. హృదయమనెడి ఖిల్లాను అధిష్టించియున్న కామ క్రోధాద్యరి షడ్వర్గమును ధ్యానశస్త్రముచే జయింపుచున్నాడు.

స్వవశము పాగతవిషయ మనూనం కలయతి కలయాభగవదధీనం॥౪ భూత॥

తా. భగవంతునిదయచేవిషయములస్వాధీనపరచుకొని యింద్రియయుక్తముగాసర్వము భగవదధీనముచేయుచున్నాడు.

నస్వ్యాసు భవతో భజతిచ తృప్తిం సిరంతిశ యైక సుఖామి వసుప్తిం॥౫॥ భూత॥

తా. ప్రత్యాఖిన్న బ్రహ్మానందావాప్తి చేనిరతిశయతృప్తిని బొందుచున్నాడు.

గణయతి స్వగురు ముఖాగత మన్త్రం। రహసివ శీకృత పరశివ తంత్రం ॥౬॥

తా. ఆట్టియోగి ఏకాంతమునశివతత్వముస్వాధీనముగాచేసికొనితనకు రూపదిష్టమంత్రమును జపింపుచున్నాడు.

చరతిసిరంకుశ ముపచితభద్రా॥స్థిరయతిగురుకృపయాగత ముద్రాం

తా. మంగళప్రదమైన గురుకృపాప్రాప్త ఖేచరీముద్రను ధరింపుచున్నాడు.

ఇతికవిరాజ మహీసురగీతం సుఖయ తురసికందిశిదిశి వితతం॥౮॥

తా. ఈరీతి రాజేశ్వర పండితరచితమగు సదాశివగీతము ప్రతిదేశములయందున భక్తజనములనానందించుగాక.

రాచల్లోపాఖ్యవిఖ్యాత రాజేశ్వర కవీశ్వరః॥గీతగౌరీశ కావ్యేస్మిన్ షష్ఠం సర్గ మయోజయత్॥

తా. రాచల్లరాజేశ్వర పండిత రచితమైన గీతగౌరీశకావ్యమున షష్ఠ సర్గ ముగిసెను.

సప్త మస్సర్గః.



శ్లో. అస్యాంత రేస భసితక్షీణ వామేనాక్షి పక్షద్వ యేసని యతేన సదా

విభాతి। హృదంబర కాసరి వృకోలి కపూర్వశైల భ్రూవల్లి కాంత ర
విరాజిత బిందురిందుః॥ ౩౭

తా. యోగీంద్రులతిలో ఇడాపింగళామధ్యగత సుషుమ్నా పింగళా నాడ్యంతరమున దహ
రాకాశస్వరూపమగు చంద్రబింబసదృశమగు బిందురూపమును చూచుచున్నాడు.

విలసతి హృదయ సరోజేవి గతమ నోజే మహేశ్వర ధ్యానాత్।తప
సాక్షాంభవ యోగీవిషయవిరాగీజ గాఢవిన యేన॥ ౩౮

తా. ప్రకాశించుచున్నవై కామాదిదోష రహితమై హృత్కమలమందు లీనోయు
క్తమైన పరమేశ్వరధ్యానము వలనసర్వవిషయవిరాగియగు యాశివయోగివిసయముక్తుడై
మరలపద్గురుని గూర్చియొకవాక్యము పలుకుచున్నాడు.

మాళవరాగేణగీయతే.

గీ. కృతకర్మ ఘనవిబిడ భవతి మిరశోధన॥ తవచరణ నఖతరణి రుచిరే
వ సాధనః॥ శ్రీ గురోత్వమి హాశగణా మరాధి వితతిని పీడితోహం

తా. హేసద్గురో దుఃఖప్రదములగు ఆధివ్యాధులచే నాపీడితుడనగు కుతామేరసు
కులు మలిమూపూర్వార్జితమగు కర్మమను మేఘము వలనదట్టమైన సంసారాంధకారనివృ
త్తికొరకు భవత్పాదనఖ సూర్యకాంతియే కారణము.

త్వదవగ మనాయ బహువిధని గముకాననం శీలితమదశిఽ నకృద పి
చర తవాననం॥ శ్రీ॥ ౧

తా. లమనిజమగుశివరూపము పొందుటకై నిఖిలములగునిగమారణ్యములను తిరిగివె
దకినను ఆనందరూపమగు ముఖకమలదర్శనము కానలేదు.

అపివసతి మయిచత పచరణ సదుపాసనా। జాతు నజహాతి బత్తవిష
య సుఖవాసనా॥ ౩

తా. నాహృత్కమలమందొకసారి భవదీయచరణోపాసన జన్గ చున్ననుకులినరూ
పమగు యావిషయవాసన నన్నువదలకపోవునా నీకేరక్షకుడవు

తనుభోగసుఖ ముఖమతి చం చలమ పీక్షణః। నత్వ యిదధాతిమమ
హృదయ మహమోక్షణః॥ ౪

తా. అనాద్యవిద్యావాసనచేత అనేకజన్మలనుంచి భోగాభినది గలదిగనుక బహు
చపలమగు నాచిత్తమప్రయత్నముచేసినను లినముందుప్రవేశింపను కావునశ్రీగురోనీవేన

పుకుద వ్.

ఉదరభరణా యతను మనుసరతి పామరం। నభవంత మియమవిలన మద్భుల పామరం॥ ౫

తా. హేగురో! నాబుద్ధి ఉదరభరణార్థమైతుతిని చున్నదైనా భజించుచున్నది కానిపా పకలమైన వపుస్కాన్నయుచే రక్షించుచున్న నిన్ను భజించదు కావున హేగురో! రక్షించుము.

సదను ..మనాయన కదాపి సువిచారితం। మనసిసంతమ సమధునా నని వారితం ॥౬॥

తా. ఓసద్గురో! సర్వుసత్ప్రాంత్యమున కొకసారియైనను విచారింపను కావున యీదుష్ట్వానాంధకారమేరీతి వదలిపోవును.

త్రిజగ దవనాయ శివజయుతిత వజృంభితం। యేనమధు రేణ జితమమృత మజకల్పితం ॥౭॥

తా. ఓపరమశివ నీనామస్మరణ సర్వబ్రహ్మాండ సంరక్షణకొరకై సర్వోత్కృష్టముగా వర్తింపుచున్నది మధురమగునీనామస్మరణచేతనమృతమైన జయింపబడినది.

ఇతిజయతి కవిరాజ భూసుర సరస్వతీ। బుధసదసి సరసికవి దీప్తి రితి భాస్వతీ ॥౮॥

తా. ఈప్రకారముగా కవిశ్రేష్ఠుడగు రాజేశ్వరపండితవాణి సర్వోత్కర్షమందును కాంతివలెనే పండితసభయందు ప్రకాశింపుచున్నది.

శ్లో. అధానతా స్వాంఘ్రి సరోజ మూలేము ముక్షు మస్వేత్యు నిరస్తశిష్యా నిరీక్ష్య యాణో మనసా మహేశం గురుః కృపావాన్ పునరేవమాహ ॥౩౮॥

తా. పిమ్మటస్వపాదకమలములందు శరణాగతుడును విరాగియు ముముక్షుడునగుశిష్యునిజూచి తనహృత్కమలమందు పరమేశ్వరునిధ్యానింపుచున్నవాడై గురుడుదయతో నిట్లనెను.

ఘూర్జరీ రాగేణగీయతే

గీ. కృతసమాధాన చిత బుధహిత భావా ॥పరిహృతపూర్వాకృతాఖిలదోషా॥ కాపిశివశరణా। హీనసంధో భ్రసరతి జగతి విశాలగుణా॥ (గ)॥

తా. సప్తస్వర్గాన్మకస్థాన ఘనీభూతులగు పండితులచే వర్ణింపఁబడెడి సర్వభూతాన్న దుష్కృతములను నాశనముచేయు సమర్థమైన అనివార్యమగు శివకృప, త్రిలోకమందు ప్రసరించుచున్నదిగదా

అసమశర మాయుధ జితరిపువర్గా దుర్ఘట ఘటనపరైకనిసర్గా ॥౩॥

తా. ఆసదాశివకరుణ యింకయెట్టిదనిన శాంతియనునాయుధముచే కామాది శత్రుజయముకలుగఁజేసి దుర్ఘటమగు చతుర్విధపురుషార్థములకలుగఁజేయును.

సాధు సమాగమ విహితవివేకా । ప్రశమిత మరణ పునర్భవశోకా ॥

తా. సాధుసమాగమ ద్వారావివేకమును కలుగఁజేయునది జన్మమరణాది దుఃఖమును దూరముచేయునది యాశివకరుణయే

విషమ శరాహత మానసదూరా శమనభయార్తి నిరాసకఠోరా ॥౪॥

తా. ఆసదాశివ కరుణయింక యెట్టిదనిన కామక్రోధాదులచే హతమగు చిత్తముగలవారికి దూరమయినది యమధర్మరాజు భయనివారణార్థమై బహు తీక్ష్ణమయినది.

సపది సుధేవ నిరాకృత తృష్ణా। హిమరుచి రుచిరివ నిత్యావితృష్ణా॥

తా. ఇంకయెట్టిదనిన అమృతమువలెనే సకలతృష్ణను నిరాకరించునది చంద్రకాంతివలెనే అతిశీతలమయినది.

అభిమతవితరణ తోషితభక్తా ।విముఖజనైర్దుర్లభ నాపిసులభ్యా॥౬॥

తా. ఇంక యా శివ కరుణ యెట్టిదనిన, సాధుజనులకుఅభీష్టప్రదానముచే సంతోషింపఁజేయునది.దురాత్ముల మనస్సునకు దుర్లభమయినది.

అనవరతార్చన కృతమతి సుముఖా । నిందిత కృతిరత పశుజన విముఖా ॥౭॥.

తా. ఎల్లప్పుడు శివపూజాధురంధులకు అభిముఖమయినది. నిందితులైన పశువులగు జనులకు విముఖమైనది.

ఇతి కవిరాజ మహీసుర గీతం । వితరతి గాతుర భీష్ట మభీతం ॥౮॥

తా. ఈప్రకారంకవిరాజశేఖరకృతమగు గీతమును గానము చేయువారికి అభీష్టమునిచ్చును గాక.

శ్లో. అథవి వత్సురువారవిలాస యోస్స శివయోః శివయోశ్చరితం పునః। గురువిస్ఫుట వాగ్విభవో గురుః కవిహితాం। విహితాంగిరమా

పదే ॥౩౯॥

తా. వనోవారవిలాస వంతులు సర్వ మంగళ స్వరూపులగు యీ పరమేశ్వరీపర మేశ్వరుల యొక్క । చరిత్రమునుద్దేశించిసప్పు వాణికలిగిన దేశికుల వారుపండిత సమ్మి తమైన వాక్యమును పలికెను.

నరాళి రాగేణ గీయతే.

గీ. ద్యుతిజితజలదే సమధిక ఫలదే। దామచ సుగంధాకారే ॥ సురధనురు పమంబహు విధకుసుమ ఘటయతికబరీ భారే॥ రమతేరజతాచల భవనే। శివయాపురారి రధునా॥౧॥

తా. కాలమేఘు కాంతిని తిరస్కరించుచున్న గుణవంతుడైన యీపరమేశ్వరీ శిఖయందు సురధనుసమానమైన నిఖిల సుగంధ పుష్పనిర్మితమైన మాలికను ధరింపచేయుచున్న వాడై ప్రియురాలితో, కైలాస భవనమందు యీజగదీశ్వరుడు రమించుచున్నాడు.

కుచయుగకుధరేపరి మళమధురే। చందనరుచి రూషితే। ఝరమివ చటుల మమాణి సంపట లంప్రదిశతి పరిభూషితే ॥౨॥

తా. శ్రీపరిమళ గంధలిప్తమగు యీపరమేశ్వరీ కుచపర్వతముల యందు నగవనీకాశం బగు మణి సరస మాహామున ధరింపచేయుచున్నాడు.

ప్రవిచల దలకం ప్రకటిత పులకం ముఖమఖిల సదీరితం। అలికులమ లినంర వినవలి నంకలయతి మధుపూరితం ॥౩॥

తా. చలించుచున్న ముంగురులుగలిగి పులకాంకురయుక్తమై నిక్కలి ప్రకాశింపు చున్న ముఖమును మామ్యడుభ్రమర సమూహయుక్తమగు కమలమును వలెనే అమృతము చే పూరించుచున్నాడు.

విధుమివ వగగనేన సిధృతపవనే మౌక్తికమణి భూషణం। నిజతను విశదం సుమశర వశదం వితరతి గతదూషణం ॥౪॥

ఆకాశమున చంద్రునివలెనే అతి ధవళమైన మన్మథోద్దీప కంబుమణియుక్తమగు నాసికాభరణము ను ధరింపజేయుచున్నాడు.

అపగత విలయం నిజసుఖ నిలయంర త్నతిరశనాన్వితం। అపగతజల దంజగది వజఘనం సాగర సలిలావృతం ॥౫॥

తా. స్వ సుఖమునకు స్థానభూతమైన యీపరమేశ్వరి నడుము నందు సముద్రము చుట్టు భూమండలమువలెనేనవరత్న ఖచిత మగు నొడ్డాణమును ధరింప చేయుచున్నాడు

హతభవగద యోర్జ్జిత గజమదయో ర్ధృతమణినూపురయోః। ప్రముదిత ముదయో ర్మృదుతర పదయోః శ్రుతి తతిగణనూపురయోః ॥౬॥

తా. భవరోగ నివారకములగు గజగమనమును తిరస్కరించుచున్న యాపరమేశ్వరీపదములయందు శ్రుతి రూపములగు నవరత్నఖచితభూషణముల ధరింపచేయుచున్నాడు

స్ఫురదుపకరణే స్మర వీరరణే కింకిణిమి వభేరికాం। పటు పట విట పేనత. సుర మధుపే। విలసల్లత ఇవశారికాం ॥౭॥

తా. మదనవీరయుద్ధమందు భేరీవలె దివ్యమగువటవృక్షమందు చిలుకలవలె యామృదుమధ్యయందు కింకిణీయను భూషణమును ధరింపచేయుచున్నాడు.

ఇతిగుణ కలితం కవిరాట్చరితం శివపదకమలార్పితం। కవిజన హృదయం ప్రవిల సదుదయం ప్రథయతి రసతర్పితం ॥౮॥

తా. ఈరీతిశృంగార రసయుక్తమై సదభిప్రాయసహితమగు రాజేశ్వర కవిరచితమగు గీతముపరమేశ్వర పదకమలార్పిత మాయెను.

శ్లో॥ శుద్ధోపి స్ఫటికః ప్రసిద్ధగుణ వానప్రాప్త దోషామహాః। తద్వో రాజతి రాగవాన జపాపుష్ప శ్రియా సంగతః। తద్వత్ శుద్ధశివా కృతిః పశుపతిః. కామారి రప్యన్వితో। దేవ్యా కాముకవత్ కలా సుకుశలః కామేశ్వరః క్రీడతి ॥౯॥

తా. స్ఫటికము శుద్ధమైనదైనను మంకెనపుష్పసాన్నిధ్యమువలన రక్తవర్ణముకలిగి యేరీతిప్రకాశించునో ఆరీతిపరమేశ్వరీయుక్తుడై కామునివలెనేకళాశాస్త్రప్రవీణుడై శంకరుడుపరదేవితోక్రీడించుచున్నాడు.

భైరవీరాగేణగీయతే.

గీ. అవిరతరతి కుతుకిత హృదయేన విహితహితాఖిలజగదుదయేన। సా రామలా శశి మాళినా ॥౧౦॥

తా. సృష్టి కర్తయు నిరంతర సురతవాంఛా యుక్తుడగు యాచంద్రశేఖరునితోపరమేశ్వరిరమించుచున్నది.

అమిత విలసిత జనిత మదనేన। దరహాసి తామృత సితవదనేన ॥౧౧॥

తా. అమితమైన మదనోద్రేకముకలవాడును మంద హాసామృతముచెదల్లినముఖకమలముగలవాడును.

అమరయువతీకృత కుసుమశయనేన। భువనవిలోకన చణన యనేన ॥సా॥3॥

తా. దేవతాస్త్రీలచే రచింపబడిన పుష్పశయ్యగలవాడును సకల బ్రహ్మాండనిరీక్షణమందు దక్షుడైనవాడును.

కటితట ధృతగజ జల సదజినేన। సకృదభి వందనహారిత వృజినేన॥సా ॥౪॥

తా. కటిప్రదేశమందు ధరింపబడిన గజచర్మముగలవాడును। ఒక్కసారి నమస్కరించిన మాత్రము చేపాపముల హరించు వాడును

స్ఫురదమృత ఫలయుత మృదువచనేన। స్ఫుటకవితాద్భుతరసరచనేన॥సా॥౫॥

తా. ఫలప్రదమైన మృదువాణిగల వాడును స్పష్టమయిన అద్భుతమైనరసాదిరచనము గలవాడును.

నవసరసిజదళ మృదుచరణేన। త్రిదివజధునీఘనజల భరణేన॥సా॥ ౬॥

తా. హితమైన కమల సదృశమైన మృదుచరణములు కలవాడును ఆకాశ గంగా ప్రవాహమును శిరమున ధరించువాడును

శిరసి హితనవహిమకిరణేన।ప్రకృతి మతాంతి భువన శరణేన ॥సా ౭॥

తా. శిరమున ధరించి బాలచంద్రుని కలవాడును। నిఖిల బ్రహ్మాండ సంరక్షకుడును ప్రకృతిరూపమగు పరమేశ్వరితో క్రీడించుచున్నాడు

ఇతి కవిరాజ సుమతి గదితేన। తుష్యతు పశుపతి రిహ విదితేన॥౮॥

తా. ఇట్టి పరమేశ్వరుడు పరమేశ్వరీ సహితుడైన కవిరాజేశ్వర విరచిత గీతము చే సంతోషించుగాక

శ్లో. రాచర్ల నామ్నా విఖ్యాత రాజేశ్వర కవీశ్వరః। గీతగౌరీశ కావ్యేస్మిన్ సప్తమం సర్గ మభ్యధాత్ ॥౧॥

తా. ఈరీతిగ రాచర్ల రాజేశ్వర కవీశ్వరులవారు గీతగౌరీశ కావ్యమున యేడవ సర్గము ముగిసెను

శ్లో. ఇతిగుతు రభివర్ణ్య వర్ణనీయాం రహసి శివస్య శివాన్విత స్యకేళిం। గిరిశమధిగుహాశయం మహాంతంహృదిపరికల్ప్య జగాద సాభి వాదం ॥౪౧॥

తా. ఈరీతిసద్గురువులవారు వర్ణనీయమైనయాపార్వతీపరమేశ్వరులయేకాంతమందు జరిగిన లీలను వర్ణించి తరువాత యా మహేశ్వరిని చిత్తమందు ధ్యానముచేయుచు మరలయీ రీతివర్ణించు చున్నాడు.

ఘూర్జరీ రాగేణగీయతే

గీ. ఉరసి మహతిగిరిజాకుచ సంగసు సంగత కుంకుమరాగం॥ సపదివ హాసిబహిరాగత మాంతరమివపర భసాదనురాగం ॥ష॥౧॥

తా. ఓచంద్రశేఖర గొప్పవయిన వక్షస్థలమందు యాపరమేశ్వరీ సంగమమువలననే సంగతమైనకుంకుమరాగమును అతిప్రేమచేలోపల యుండెడి ప్రేమరసమునువలెవహించుచున్నావు.

దేశవరాళి రాగేణ గీయతే.

గీ. పాహి కింకర మేహిశంకర మాకురుకాల విడంబం। మామక మమితకృపారస కళయాపాకురుకలుష కదంబం॥ ౧

తా. ఓశంకర శీఘ్రముగా రమ్మా కింకరుడనైన నన్ను కావుమా ఆలస్యము చేయకుమా అధికమగు కృపారసముచే నాపాపరాసిని నివారింపుమా.

సర్వ మనోహర పర్వసుధాకర బింబమివాత్తకళంకం। వితరతుతవ వపు రసితగళం జయమంగళ మంగళశంకం॥ ౨

తా. సర్వబ్రహ్మాండములకు మనోహరము సకళంకమునగు పూర్ణచంద్రునివలెప్రకాశింపు చున్న నీలకంఠయుక్తమైన తవదివ్య మంగళ విగ్రహము మాకు జయమంగళము నిచ్చుగాక.

హృదయమివామృత మతివిమలం తవవిలసతువపురనురూపం। తల్లహరీవద రస్మితదీధితిరపనయ తాదభితాపం॥ 3

తా. ఓపరమేశ్వరా అమృతము వలెను విమల మైనతవహృదయము మాకు నను కూలముగా ప్రకాశించుగాక- అమృత ప్రవాహము వలెనేయుండెడి తవ చిరు నవ్వునా అంతస్తాపమును నివర్తించుగాక.

సురతరుమివతవ విగ్రహముగ్రసమగ్ర చతుర్భుజ శాఖం సరసము-
పేత ముమామాలతయాశ్రిత వానహ మాదృత చేలః॥ ౪

తా. ఓశంభో కల్పవృక్షమువలె చతుర్భుజములను శాఖాయుక్తమైన ఉమా లతాలింగితమైన నీదివ్య మంగళ విగ్రహమును నాశ్రయించితిని.

కటితటఘటిత గజాజినమీకృతి వానుకరోతి విశాలం। రజతధరాధ
రమురుతరమధ్యగతాంబుమదంబుదజాలం॥ ౫

తా. ఇంకనీవు విగ్రహమెట్టిదనిన— కటిప్రదేశమందు గజచర్మమును ధరించినది కావున కాలమేఘమును మధ్యప్రదేశమందు ధరించిన కైలాసగిరివలెనె ప్రకాశింపుచున్నది

నవమివగళద రవిందమమందమరందమపాస్త నిమేషం। నయనయుగ
శమతి శీతరసంత వరచయతి జగదభితోషం॥ ౬

తా. ఓసదాశివ మకరందమును స్రవించుచున్న నూతన కమలము వలెనే ప్రకాశింపుచున్నని మేషరహితమైన నీనేత్రయుగళము మిక్కిలి శీతలమై జగదానందమును రచింపుచున్నది.

హృదిసద ధామి సదాశివదాసచకోరక కైరవబంధో। చరణ సరోజ
యుగంతవ నిర్మద శర్మద సద్గుణసింధో॥ ౭

తా. భక్తజనేత్రచకోరములకు చంద్రుడవగు ఓశంకరా మదరహితమైన సౌఖ్యప్రదము నిఖిలకల్యాణగుణనిధియునగు శివ చరణారవిందయుగ్మమును సదాహృదయమందు ధ్యానించుచున్నాను.

శ్లో. శ్రీకవిరాజ సురక్షితమిదమిహ రోచయగీత మదోషం। విపదభితా
ప నిరాసక మమృతదమమృత రసాదవిశేషం॥ ౮

తా. ఓభక్తవత్సల ఆపత్తులను తాపములను నివారించుచున్నదై మోక్షప్రదమై అమృతముకంటె అధికరుచియైన శ్రీకవిరాజేశ్వర రచితమైనయీగీతమును స్వీకరింపుమా.

శ్లో. తనుశ్చేత్త్వాం సేవాభవతిచ భవధ్యాననిపుణం మనశ్చేద్వాణీ చేద్భ
వతిభవదీయస్తుతిపరా। అయం లోకో లోకోత్తమచరిత సద్భక్తి
మహతః పరందుర్గాత్స్వర్గాదపిసుఖ మహాభాజన యతి॥ ౯॥

తా. ఓశంభో ఈదేహము నిన్ను సేవించెనా మనస్సు నిన్ను ధ్యానింపుచుండెనా వాక్కు నిన్ను స్మరింపుచుండెనా ఓలోకోత్తరచరితా సద్భక్తి మహిమవలన యీమనుష్య

లోకమయినను కష్టసాధ్యమగు స్వర్గముకంటె అధిక సౌఖ్యమును కలుగ జేయుచున్నది.

శ్లో. రాచర్ల సాఖ్యానిఖ్యాత రాజేశ్వర కవీశ్వరః। గీతగౌరీశ కావ్యేస్మి న్నష్టమః సర్గ ముత్తమం ఖాత్।

తా. రాచర్ల రాజేశ్వర కవిరచితమగుగీతగౌరీశ కావ్యమున అష్టమసర్గముసెను.

## నవమస్సర్గః.



శ్లో. తమథమ నోరథ భరితం ప్రాకృత చరితం గుణేన విస్ఫురితం ॥ హృదిచింతి తశివ చరణం। భవభయ హరణం గురువర్ణ చః ప్రాహ॥

తా. అనంతరమున మనోరథ ప్రదమైన ప్రకృతివిలాస యుక్తమయిన సద్గుణ స్ఫూర్తి చమత్కృతి నుయిన శివచరణస్మృతి సహితము సంసారభయ నివారకమునగు శివసూక్తి నిమరలసద్గురులవారు పదేశించుచున్నారు.

### మోహన వసంతరాగేణగీయతే.

గీ. హితము పదిశతి దిశతిగురు రభయం శివమును. సరభవి తాసుఖము భయం। శంకరే శివశంకరే నవిచల సాధక సాధు మతే॥ ౧

తా. ఓశిష్యాగ్రగణ్యా నీవుసదాశివుని ఆశ్రయించితివేని ఇహ పరలోక సౌఖ్యము కలుగును. కావున శంకరునియందు స్థిరచిత్తుడవు కమ్ము. చలింపకుమా.

బహిరవ లోకనపరమనయనం పశ్యతుతవతజతాచలనిలయం॥శంక॥ ౨

తా. ఎప్పుడువెలుపలనే చూచుచుండెడి నీనేత్రయుగళ మ్నాగ్నేమయినయాపరమే శ్వరుని చూచెదవుగాక.

అమృతరసాదపిమధు భరితంచిర మనుభవగిరి జాధిపచరితం ॥శం॥ 3

తా. అమృత రసముకంటె అతి మధురమయిన యాగిరిజాపతి చరిత్రా మృతమును భవింపుమా.

నాథునిభాపయు శివపదకమలేష ట్పదమివతవమానసమమలే॥శం॥౪॥

తా. స్వచ్ఛమయిన సదాశివచరణారవిందమందు నీమనస్సును భ్రమరమువలె నివసింపజేయుము.

శివమభి వర్ణయ సఫలయ కవితాం గురు కృపయా పరయా చిరముదితాం ॥౫॥

తా. సదాసర్వ కాలమందు నా మహేశ్వరుని వర్ణించు గురు కృపచేత ప్రాప్త మయిన నీ పాండిత్యమును సఫలము చేసికొమ్ము.

అర్చయ శివమిహ పరికరబహులైం కిమితి కరోషిన్ను ధాకరయుగళం శంకరే ॥౬॥

తా. ఓ సాధకుడా అనేకములగు ఉపచారములచేత సర్వమంగళా పతిని పూజింపుమా. హస్తద్వయమును వ్యర్థముచేయకుమా.

ప్రతిదినము భిసరశాంభవసదనం తృణ మివమన సితిరస్కురు మదనం శంకరే ॥౭॥

తా. ఓ భక్తుడా నిత్యమా పరమేశ్వర మందిరమునకు జనుమా. మన్మథుని తృణము వలెనె తిరస్కరించుమా.

ఇతి కవి రాజ సుకీకృ తరచనం సుఖయతు భక్త జనంగురు వచనం శంకరే ॥౮॥

తా. ఈరీతిగ రాజేశ్వర పండిత రచితమైన గురూపదేశము భక్తజనుని సుఖవంతునిగా చేయుగాక.

శ్లో. శాస్త్రే నాస్తిక తామథే విముఖ తాదృశ్యైఖ లేసత్యతా। సర్వేశే వ్యర్థధు రంధరేస్మ రహరే గీర్వాణ సామాన్యతా। నేరేసంచక తాగురౌ మను జతా కే షాంచిదా భాతిచేత్త ద్దేహాత్మ థియామ యుక్తమితి హాకోవా విపశ్చిత్ వదేత్॥

తా. ఎవరికి శాస్త్రమందు నాస్తికతా బుద్ధియును। అస్థిర ప్రపంచమందు నిత్యత్వ బుద్ధియును। సర్వైశ్వర్య పరిపూర్ణుడగు పరమేశ్వరునియందు సర్వదేవ సమత్వమును దీనుని యందువాచ కత్వమును సద్గురునియందు మనుష్యబుద్ధి యు యుండునో అట్టి దేహాత్మ వాదుల యొక్క దుర్మతిని యెట్టిమహా పండితుడైన గురువైన నివారింపలేడు యెట్టి వాడైనబోధింప లేడనుట.

శ్లో. రాచలోట సాఖ్యవిఖ్యాతి రాజేశ్వర కవీశ్వరః। గీతగౌరీశ కావ్యేస్మి న్నవ మంసర్గ మభ్యధాత్ ॥౯॥

తా. ఈరీతిరాచర్ల రాజేశ్వర కవీశ్వరునిచే రచితమగు శ్రీగీతగౌరీశ కావ్యమున తొమ్మిదవ సర్గము ముగిసెను.

## దశ మస్సర్గః.

—

శ్లో. అత్రాంత రేనిబిడ బోధర వేర బోధ గాఢాంధ కారమ పనోదసము
ద్య మేన। ధ్యాయన్మ హేశ్వరమన స్యర మేష విద్వాన్ సద్భక్తి యు
క్తిరచనం వచనం జగాద ॥౮౭॥

తా. ఇంతలోపల దృఢమయిన జ్ఞానసూర్యుని యొక్క అజ్ఞానాంధకారని వార ణాథకా మైన ప్రయత్నముచే పండితుడు మనసు నందు పరమేశ్వరుని ధ్యానము చేయు చున్న వాడై భక్తియుక్తి సాధనంబగు వచనమును పలికెను.

వరాళి రాగేణగీయతే.

గీ. మనసియది స్మృత్రిరియానుమ చపరి పాలనే పాలయ కృపా లయ విలో
లం। సుచండతర దండధర త్రోపి సమృకండుజోనభుపకి మరక్షిసుఖలీ
లం ॥ప॥ పాహిశంభో విభోపాహి ॥౧॥

తా. ఓదీనదయాళో నన్ను సంరక్షించుటకై నీకుసంకల్ప ముండెనా బహుచప లుడనైన నన్ను సంరక్షించుమా॥ పూర్వకాలమున భయంకరుడయిన యమునివలన తా ముభూమియందు మార్కండేయుని రక్షించ లేదా।అరీతి గానేనన్ను శంభో రక్షింపర క్షించుమా

త్రివిధపరి తాపదవదహాన గతపీకితే ప్రధరమయి సాదర మమోఘం
జాగ్రత మనుగ్రహామను శ్రమన వగ్రహం హితమమిత సలిల మివ మే
ఘః ॥౨॥

తా. ఓదయానిధౌ తాపత్రయ మనెడిదావాగ్నిచే పీడితుడనైన నాయందునా ర్యతాప తప్తమగు వనస్థలియందు మేఘునివలె నెల్ల నుగ్రహవర్షమును వర్షింపుమా

శంకరస్త్వమపి యదిసుఖమి హావిధే హిమే సార్థకం సఫల మభిధా
నం। కర్మేతి చేద ఘటి తార్థ ఘ టనాపటుకి మిదమ భివా చనమ
నూనం ॥3॥

తా. హేపరమేశ్వరా,నీవు శంకరుడవైతివేని నాకు సౌఖ్యమును కలుగ జేసియా నామమును సార్థకముచేసి కొనుమా। అఘటిత ఘటనా సామర్థ్యము కలిగి కర్మయని

మాత్రమునను వంచింపకుమా

యది సుగుణ దోష పరిగణన మిహా సేనేక్షసే మయి సుగుణ లేశం।
దోషాస్తు ధరణీపరాగ పటలాది కాస్తదపి నునత దధివేశం ॥౪

తా. ఓ పరమ శివనాయుడు సద్గుణలేశ మైనను లేదు దోషముల విచారించి పృథివీ పరమాణువుల కంటె అధికము గాకలవు కావున వాటిని విచారింపక నిహేతుకకటాక్షముచే రక్షింపుమా

పశురస్మి పశుపతి స్త్వమసి పతితో౽స్మ్యహం పావనస్త్వమసి శివశూ
లిన్। అస్త్యేవ సంబంధమావయోర్నృప భృత్యయోరివ ప్రకటగు
ణ శాలిన్ ॥౫॥

తా. ఓ పశుపతే నేను పశువును నీవు పశుపతివి నేను పాపిని నీవు పతితపావనుడవు ఓ శూలధారీ నీకు నాకు యీ సంబంధము రాజభృత్యులవలె గలదు కావున ఆనుగ్రహించి రక్షింపుమా

పరమేష్ఠి శేషేమయి త్వ యిజయతి శేషతా వనజభవ దివిషదీడ్య। త్వ
ద్య శోప్యమాలవిహా మేవనవి చార్యతేక్వను చిత్రకృతి రసతి కుడ్యే ౬

తా. ఓ బ్రహ్మాది సురసన్నుత। శేషభూతుడనయిన నేనుండ నీకు శేషిత్వము గలిగెను కావున తమకీ రీకి నేనే కారణభూతుడను। యెక్కడనైనా గోడలేని చిత్తరువు కలదా కావున విచారించి రక్షించుమా

త్వమసి మమ దేవతా త్వమసి మమ పాలకస్త్వమసి మమ జలధి నౌకా। త్వ
మసి మమ శేముషీ త్వమసి మమ భారతీ త్వాం వినా నాస్తి గతి రేకా

తా. ఓ శంభో నీవే నా దేవతవు। నీవే నా రక్షకుడవు। నీవే నా సంసారసాగర నావు। నీవే నా బుద్ధివి। నీవే నా సరస్వతివి నిన్ను విడా చెడి నాకు గతి లేదు కావున రక్షించుమా

ఇతి తవ ప్రీతయే భవతు భవతార కాస్ఫురిత మధురార్థ ఫల జాతం।
సుమతి పద్మావతీ రమణ భాస్కర రాయశిష్యక విరాజ కృతగీతం ౮

తా. ఓ సర్వమంగళాపతే ప్రకాశింపుచున్న మధురార్థము గలదియును। పద్మావతీ పతి యగు భాస్కరరాయ శిష్యుడగు రాజేశ్వర కవి నిర్మితమగు గీతము తమకు సంతోషముకలుగ చేయుగాక

శ్లో. బహుళ దురితాతంక శంకాకులం కితచేత సో౽విషయ వితతిం మోహాది

కమతీవ వితన్వంతః। పరమ కరుణా సి-ధో బ-ధో మమాద్యాపి నీయ తాం। శివమదన సేనాన్యో విభాతి జగత్రయే ॥౮౬॥

తా. ఓసదా శివ బహుళపాపప్రీతి బంధముచే భయ చిత్తుడ నైన। విషయాసమూహ మున మోహాసక్తము చే వెసకు చుండెడి నాకు హెడయాని ధేనీ నే బంధుడవునిన్ను వదలితిని లోక దేవుకు రక్షకుడు లేడు కావున రక్షింపుమా

శ్లో. కృతకు వలయుస్ఫూర్తి ద్విజాయన తాయనే। సపది శిరసిస్తోకాం గాకామివేశ్వరదర్శనయ। హిమరుచిరుచిస్నిగ్ధై ముగ్ధైర్మ్మఖస్యదరిస్మిత్తైస్తరణికిరణాటోకం తాపం నివారయ.

తా. ఓసర్వా పన్ని వారక నీకు శరణు బొందిన యాదీనుడ నగుచా శిరస్సునందు కోమునమల యందు పండు వెన్నెల వలెనె కరుణారసము నువర్షించి చల్ల నైన చిఱునవ్వుల చేత సూర్యతాపము కంటె నధికమగుచా త్రివిధతాపమును హరింపుమా

శ్లో. శంభోవిధే హిమయి తేచ రణారవిందే। భక్తిం సయుక్తి మను రక్తి మపిత్వ దీయే। చండీశ చండ ఫణికుండల దండ పాణే రుద్రుండ దుఃడక్ష లనా దధయం ప్రదేహి ॥౮౭॥

తా. ఓశంభోమీ చరణారవింద జ్ఞానవై రాగ్య యుక్త మగు భక్తి నినాకు కలుగజేయుమా। ఓచండీశ। హెఫణికుండల ఘోరమగుయమదండభయ యుక్తుడనగునాయందు ననుగ్రహింపుమా

శ్లో. భూమిస్యందన మిందుసూర్యా చకిల తచ్చ క్రైవిధిస్సారధిర్వేదాస్తుంగ తరంగ మాధనుర సౌమేరుః ఫణీ ద్రోగుణః। బాణో బాణ భుజాట వీవిఘు టకస్తూణీ నదీనాం విభుర్లక్ష్యం త్రిణిపురాణి శౌర్యాజలధేర్విశ్వం విధేయంతవ ।౮౮।

తా. ఓశంభోతమకు భూమిరథము। చంద్రసూర్యులు చక్రములు। బ్రహ్మసారధి। నాల్గువేదములుగుఱ్ఱములు। మేరుపర్వతేమధనుస్సు। ఆదిశేషుడు నార్యబాణముపిష్ణువు సముద్రుడు తూణీరము। త్రిపురములు లక్ష్యము। ఇట్టిశౌర్య నిధిపయినటిమరొక్క వైభవమును నేమని వర్ణించుదును.

శ్లో. గతి ర్యద్ధిర ద్రోద్ధతా మతిరనేక మత్తేభదా మనో ధృత విలంబితం
శివత వాల్మిర్ణ మత్యాగ సః తను స్ఫురతి మాలినీ ప్రథిత వృత్త ర
త్నాకర శ్రియం వహసి ధైర్యశ్రీ జయసి హేమపృథ్వీధరం ॥౧౨।

తా. ఓశంభో నీవు గమనమును విచారించిన రథోద్ధత మైనది తమబుద్ధి గజాంతైశ్వర్యము నిచ్చును మనస్సుఅతిగంభీర మైనది తమదేహము మౌక్తికహార ములు గలది అతి ప్రసిద్ధినిజెందిన వృత్త రత్నాకరము యొక్కశోభ నువహించుచున్నది ధైర్యలక్ష్మిచేత మేరుపర్వతమును గూడజయించు చున్నావు.

శ్లో. రాచలో౯ సాఖ్యవిఖ్యాతరాజేశ్వర కవీశ్వరః। గీతగౌరీశ కావ్యేస్మి౯
దశమం సర్గ మభ్యధాత్ ॥౧౩॥

తా. రాచర్ల రాజేశ్వరకవి విరచితమగు గీతగౌరీశ కావ్యమున పదియవసర్గము ముగిసెను.

ఏకాదశ సర్గః.



శ్లో. త్రిభువన గురుమేవం ప్రార్థయిత్వాపి దత్వా హృదయ కమల పీ
ఠేసుప్రసన్నం నిషణ్ణః। గురురథనిజ శిష్యం వీక్ష్యమోదాత్ప్రసాదా
దధిపతిరివ వాచాం ప్రోక్షనాచండ వాచ ॥౧౧॥

తా. సర్వ బ్రహ్మాండ గురువగు యామహేశ్వరుని నీరీతిగ ప్రార్థనచేసి గుర్తెరిగి హృత్కమలపీఠమందు నివసించి యున్న యాప్రసన్నమూర్తి నిధ్యానించిగురువులవారు నిజశిష్యునినిరీక్షించి సంతోషమువలన అనుగ్రహము వలన దేవగురువలెనె మరల నొక వాక్యము పలికెను.

మాళవ రాగేణ గీయతే

గీ. భక్తిరసాంజన మరిభయభంజన ముపచితలస దవధానం। వహసి య
దస్థిర గురుకృపయాప్యసి పరశివతత్వ నిధానం। శంభుంశుభచరితం
హేసాధో శంభుం పశుపతి మనుసర సాధో॥ ౧

తా. ఓముముక్షో భక్తి రసాలంకృతమునరిషడ్వర్గ నివారక మునగు శ్రేష్ఠ మయిన కవచమును వహించితివి స్థిరమగు గురుకృపచేత యాపర మేశ్వర తత్వము నకు ఆశ్రయభూతుడవు కాగలవు కావునఓసాధో సుఖకరుడగు యాపశుపతిని భజింపుమా.

---

గీ. త్వామభిరక్షతి భక్తిరనిందిత శాశ్వతసౌఖ్య విధాత్రీ। సకృదప రాధ విధావపిమాన భయాదుభవే దిహధాత్రీ॥ ౨

తా. సాధో ఆభక్తి శాశ్వత సౌఖ్యమును కలుగ చేయుటయే కాక అధార్వ త్తయప రాధముచేసినను సురకృపచేత తల్లివలెనె భయమును దూరముచేయును.

గీ. సూక్తిరబాధిత యుక్తిరివానిశమనఘమతేర విలంబా॥ భక్తిరుపాహితముక్తిసులం కురుతేఖిల సుగుణకదంబం॥ 3

తా. సుధీవర దోషరహితమా యుక్తి యుక్తమునగు పాండిత్యము పురుషుని అలంకరించిన చందమున అఖిల సద్గుణ యుక్తమగు నాభక్తి ముక్తి కాంతనలంకరించును.

గీ. స్వాంతవసంత విజృంభిత భక్తిరసాలవ నీవిమలాని। స్వాశ్రితసద్విజతృప్తిఫలాని బహునిదదాతు ఫలాని॥ ౪

తా. తనహృదయమను వసంతఋతువ యందభివృద్ధిని బొంది సభక్తి యనెడి తియ్య మామిడివనము దోష రహితములును ద్విజతృప్తి ఫలకములనగు బహుఫలములనియ్యగలదు.

గీ. స్థైర్యవతీ త్వాయిహిమవతి కృతిజనిరివ బహు సద్గుణ పూర్ణా। రమయతు భక్తిరివాదిమ శక్తిరధీశమనిశమ పర్ణా॥ ౫

తా. ఓభక్తాగ్రగణ్య హిమవంతుని పుత్రికయు, సద్గుణపరి పూర్ణురా లునగు పార్వతివలె స్థైర్యబుద్ధిగల నీయందెల్లప్పుడు భక్తి రమించు గాక.

గీ. దేశికజలధర విభవసముత్సుక శాపకభక్తి మయూరీ। నృత్యతు సంసృతివనభువితుమ్యతు పశుపతినాసహగౌరీ॥ ౬

తా. దేశికుడనెడి కాలమేఘ వైభవ ముచే సంతోష భరితయై ఓసాధో నీభక్తి యనెడి మయూరస్త్రీ శిక్షితమగు నీహృదయమనెడి వన భూమియందు పశుపతితో పర మేశ్వరివలెనే క్రీడించును.

గీ. త్వామభిషించతు విషయ విరక్తి జలోచవ యుక్తితరంగా। త్రికరణలోక గతాశివజలధిగ భక్తిసముంచిత గంగా॥ ౭

తా. విషయవిరక్తి జ్ఞానయుక్తు లనెడితరంగ యుక్త మయినదియు సుపరశివసముద్రగామిని యునగు భక్తి యనెడి గంగనిన్ను అభిషేకించు గాక

గీ. ఇతికవిరాజ సరోజరగీత పయోరుహ మధుర మరందః। శ్రీగురుభాస్కర కరకృతవిభవం సుఖయతురసిక మిళిందం॥

తా. ఈరీతి వాణీశ్వర కవియనెడి కమలము శ్రీకాశీవాస దినకరకృపా విభవము వలన వికసితమై రసికభృంగములను సంతోషింప చేయుచున్నది.

శ్లో. కోవా దాతి పిపాసితాయ సుధా పాథఃపానీ గంగో దకా న్నాతస్థా స్వలిచాస్వతిద్విజ కరేవిత్తాని మత్ప్రీతయే। ఇత్యం తత్పాదనుతే కృపాం వితనుతే పంథా నముద్వీక్షతే దత్వా సంచినుతే ఫలం ఫలతు కమహో కాశ్యాంహి విశ్వేశ్వరః॥ ౫౨

తా. కాశీనగరమందు విశ్వనాథుడు దప్పికలవానికి నలెనే, అన్నకలుల్యములగుగంగోదకమును వాడెవ్వడిచ్చు నాప్రీతికొరకు కిచ్చుట విత్తమెవడు బ్రాహ్మణుల కిచ్చెడు నని చిత్తమందు సంకల్పించి యెదురుచూచు చుండును.

శ్లో. వక్త్రేహాసతి హారకాస్తనతటే వీటీషు కర్పూరతే శ్రోత్రే కేతకికర్ణపూరతి కరేలీలా సితాంభోజతి॥ చిత్రం పాతుపదం చరిత్రనుఘుఖితాప్రసేసుధా పూరతి శ్రోణ్యాం శ్యామతి చందనత్యంగయో వేష్యా కాశీమతీ నామస్పృహా॥ ౫౩

తా. ఓ రసిక జనులారా చిత్రమయిన పరమేశు చరితము జంగమాము ఖమందుహాసమగుచున్నది.విడెములందు కర్పూరమగుచున్నది.చెవులను మొగిలిరేకగుచున్నది హస్తమందు కమలమగుచున్నది. పానమందు మృతమగుచున్నది. కటిప్రదేశమందు శ్యామమగుచున్నది అవయవములందు శ్రీచందనమగుచున్నది.

శ్లో. కాశీప్రయాణాలి పరమేశ్వర రాజధానీ ముద్దండ దండధర దండభయేనమత్యాః॥ కాంతార ఘోర మృగచోర భయావృతాహో ధ్యాతద్భక్తి హేమసికతా ఫలతాందదాతి॥ ౫౪

తా. మనుష్యశ్రేష్ఠులు భయంకరుడగు దండధరమండ భయముచే వారణాసికి జనుచున్నారు. ఘోరారణ్య మధ్యమున క్రూరమృగ చోరాది భయ సహితమైన మార్గము వారివథకైన పరీక్షించుటకు పరిసిద్ధరాయిగదా సర్వత్రభక్తియే ఫలము నిచ్చుచున్నది.

శ్లో. ఏనం సదాశివ కథామృతపానసౌఖ్యా దుల్లాససల్లవిత మానసమానతాంగం। రోమాంచ కంచుకిత మంచిత బాష్పపూరం శిష్యం నిరీక్ష్య కృపయానుగురి త్యువాచ॥ ౫౫

తా. ఈప్రకారము సదాశివమూర్తి కథామృత పానసుఖముచే వికసించినమనస్సు

కలిగి శ్రవ్యార్థులను సంజాతపులకాంకురను ఆనందబాష్ప పూరిత నేత్రకమలులునగు శిష్యోపచార్చ గద్గదస్వరులవారికీతి పలికెను. ౮

నాదనామ క్రియా రాగేణ గీయతే

గీ. ద్యుతివిజిత శశిరంజిత శైలసదనం। దరహసిత రుచిలసితపంచవదనం। కలయ సాధో చేతసి మహేశం ॥ ధ్రు॥ ౧

తా. ఓశిష్యా ధవళకాంతిచే చంద్రుని కైలాసమును తిరస్కరించుచు మందహాసముచే ప్రకాశించుచున్న పంచముఖములు కలిగినమహేశ్వరుని చిత్తమందు ధ్యానింపుము.

గీ. గతవినయ దితితనయ విలయ యోగం। మణిరుచిర ఫణికర వలయ యోగం॥ ౨

తా. అవినయ రాక్షససంహారమందు దక్షుడను, మణిఖచితమయిన ఫణిహారధరుడైన శివుని ధ్యానింపుము.

గీ. దురధిగమ ఘనసిగమ గ్రామవిహారం। స్ఫురదనుజ పురదనుజ సమరధీరం॥ ౩

తా. దుర్గమమయిన ఘనమగునిగమ సోపానమందు విహరింపుచున్న త్రిపురాసురయుద్ధమందు ధీరుడగుపరమేశ్వరుని భజింపుము.

గీ. జితసవన కృతసవన మునివిధేయం। స్మరదమన మఘశమన నామధేయం॥ ౪

తా. జితేంద్రియులు యజ్ఞకర్తలునగు మునీశ్వరులకు సులభుడై మన్మథసంహారకుడై పాపనాశకుడనునామధేయముగల యీసదాశివమూర్తిని సేవింపుము.

గీ. బహుఫలద నవజలద నీలకంఠం। నిజభవనజగదవన పరమకుఠారం॥ ౫

తా. బహు ఫలప్రదుడును భక్తులను మేఘములకు నీలకంఠుడును స్వగృహములగు బ్రహ్మాండ రక్షణమందు మిక్కిలి వేడుకగలవాడగు యీసర్వేశ్వరుని భజింపుము.

గీ. ధృతతరుణ హిమకిరణ మఖిలశరణం। భవతరణ మురుకరుణ విమలచరణం॥ ౬

తా. ఓభక్తవర నూతనచంద్రకళాధారియు సంసారతారకుడు భక్తుల యందధికదయగలవాడును పవిత్రచరణయుగ్మము గలవాడును,

గీ. అసిచటుల భుజపటలభూరిరౌద్రం దక్షమఖ రూక్షముఖ వీరభద్రం॥

తా. శత్రుసంహారార్థమై ఖడ్గాద్యాయుధములచే భయంకరమగు హస్త సమూహ

ముగల వాకునదత్తోపార్జనంగాన్తమై భయంకరుడగు వీరభద్రుడను పుత్రుడు గలవాడునగు నట్టిమహేశ్వరుని ధ్యానింపుము.

గీ. వదతీవచ్ఛాన్నవతి వతీసమాజేముదమయతు ధియామునతు సకవిరాజే॥౧

తా. ఈకీతి భాస్కరసభయందు వర్ణింపుచున్న రాజేశ్వరకవియందు యాపరమే శ్వరుడను గ్రహించుగాక.

శ్లో॥ మన్త్రశ్శైవ తన్త్రవిద్గురుముఖప్రాప్తస్తదర్థానుసంధానస్నేహధురంధరం యదిమనో భక్తిస్సయుక్తిర్యది। సాధూనామనఘోదయానామదిదయా విశ్వస్యభర్తుర్మహాదేవస్యాద్భుత వైభవస్య చరణాం భోజేకులతస్యాత్ప్రభవః॥ ౧

తా. మంత్రముశివతత్వజ్ఞుడగు సద్గురులవలన ప్రాప్తమాయెనా, మనసు అమంత్రార్థము చక్కగాను చారించినదాయెనా, సత్పురుషులదయగలైనా సర్వబ్రహ్మాండనాయకుడును మహాదేవచరణారవిందోపాసకుడునగు భక్తునిశ్రీభవమేరీతికలుగును.

రామక్రియా రాగేణ గీయతే.

గీ. ముద్రాకలన భగీరథయత్నసమేధిత మితపదరాసం। గాంగంజలమివ శారద మపహృతపాపమపాకృతతాపం॥ప॥హృదయేసదయే కిమపిసు విమలమనంగం।సాదదర్శశివయోగిశిఖామణిరురుతరచిన్మయలింగం॥

తా. భగీరథతపస్సంప్రాప్తమును ఇపసులకప్రాప్యమును శరత్కాల సంబంధమైనది. యును సర్వపాపతాప హారమునగు గంగాజలమువలె హృదయ సరోజమందు శివయోగిశిరోమణి నిర్మలమయినఘనమైన చిన్మయలింగమును చూచెను.

గీ. తస్యవిధేరివ దేశికవిదుషో వదనగతామనవద్యా। మతిగత జాడ్యనివారక తారకపుణ్యపదామివ విద్యా॥ ౨

తా. తర్వాత నాపరమేశ్వరుని నాజ్ఞాపండితుడగు దేశికులవారి వలనదోషరహితమైనదియు బుద్ధిస్థజాడ్యనివారకమునయిన తారకవిద్యను శివయోగిపొందును.

గీ. మూర్ధాన్తరాకాశ విదిర్ణితహిమరుచి రోచిష మపగత శోకాం। అంతర్ముఖనయ నద్విజభూత్యై పంచదశవివరాకాం॥ 3

తా. ఆపరమేశ్వరశిరస్సగు నాకాశమందు ప్రకాశింపుచున్న చంద్రికవలె దుఃఖనివారకమయిన అంతర్ముఖజ్ఞానులకు సద్బ్రాహ్మణుల కాపరమేశ్వర తారకవిద్య నుభవించును

గీ. శారదసిరద మండలమివపరి పాండురమాదిమ లోలం। ప్రణవరవోజ్వల గళితమాదిమ సుకృతఫలేన విశాలం॥ ౪

తా. లక్ష్యాలక్ష్యాల మేఘమండలము వలె ధవళము, అనాదియు భగవత్కథాసు స్థిరముగు ప్రణవనాదము పుణ్యఫలముచే ప్రత్యక్షమాయెను.

గీ. ఆజ్ఞాచక్ర సముంచిత మస్తకశస్త సుసౌధే। ధగధగితాద్భుత తేజఃకణ కుసుమార్చిత ముపగత శాధే॥ ౫

తా. అధిగవత్స్వరూపం బెట్టిదనిన ఆజ్ఞాచక్రమను సౌధమందు ధగధగ ప్రకాశించుచున్న తేజఃకణములను పుష్పములచే పూజితమగు చున్నది

గీ. మోక్షరమాస్పద మక్షయమనిమిష గోచరమస్మృత సమ్ముద్రం। గురుకరుణాభ్యుద యేందువివర్ధిత మవధృతతారక ముద్రం॥ ౬

తా. మోక్షలక్ష్మీకి స్థానభూతమై వాళరహితమైనది గురుకృపయనెడి చంద్రకాంతిచే ప్రకాశించును.

గీ. నిశ్వసితోచ్ఛ్వసితో భయపక్షమలక్షిత గతిమివహంసం। కుంభకసూర్యవిజృంభిత దేహసరోంతర కమలాంతరంసం॥ ౭

తా. నిశ్వాసోచ్ఛ్వాసముల నుభయపక్షములు గలదిగ కనుపించునది హంసరూపము యినది కుంభకమనెడి సూర్యునికి సితహృత్కమలమందు విహరించుచున్నది.

శ్లో. ఇతికవిరాజ సమీరిత గీతపివర్ణిత యోగవిభూతిం। కలయతుకలు షాణిచ శమయతు వినయతుకామమరాతిం॥ ౮

తా. ఈరీతి రాజేశ్వర కవిచేరచింపబడిన సదాశివ గీతయందు వర్ణింపబడిన యోగ వైభవమును నెవ్వడు మనుమనులోంచి ధ్యానముచేయునో వానికిసకల కల్మషములు నివారితములయి కామాది శత్రులజయించి కృతార్థులవుదురు.

శ్లో. అతీత్యభ్రూమధ్యం దశశతదళశ్రీపుర పథ ప్రవాసేనాయాసాదివని భృతవిశ్రాంతిమయతః। మునేర్యోగాభ్యాస ప్రథితమధు మధ్యోష్ణ సమయే బభూవాశ్లోస్స్వేదోద్గమ ఇవశివానందసలిలః॥ ౧౭

తా. భ్రూమధ్యముదాటి శ్రీపురప్రవేశా గతమగునాయాసమునుడిచి వలెసంపూర్ణవిశ్రాంతిని పొందుచున్న శివయోగికి యోగాభ్యాసమువలన ప్రాప్తమయిన వేడిమిచే వసంతకాలమందు వలెచెమటబిందువుల శివానందజలము నేత్రములందుసంభవించుచున్నది.

శ్లో. విశుద్ధంశుద్ధాంతం పరమగుహువాచాం విమృశతః పరిస్థితాద్వైతావృతిముచిత యోగాశ్వినయతః। మునేస్తస్యాప్యంతః పునరపితదాశామివగతాసమాయా మాయాచిద్వపుషి బహిరేవస్థితమతేః॥ ౧౯

తా. సద్గురువులవారికలనఉపదిష్టమయిన మహావాక్యముల విశుద్ధమయిన సిద్ధాంత

మును పిమ్మట్లింపుచుండ నభిన్నక్తి చేసిన రోగము వలన శిష్టులయి యోగీశ్వరుని స్వహృదయమున దయా కారుణ్యమును స్మరించి పోయినా, విద్యాపసంధమకుచిత్త సుకలుగ పోయినా, మాయా కైశేలచేసిను వలె నేబహి ర్భాగము నందు సిద్ధముగా నుండునుకావునవ్వైకచిత్తము కావలయునని తాత్పర్యము.

శ్లో. రాచల్లోపాఖ్య విఖ్యాతరాజేశ్వర కవీశ్వరః। గీతగౌరీశకావ్యేస్మిన్ సర్గమేకాదశంజగౌ॥

తా. ఈరీతిగ రాచల్లరాజేశ్వర కవివర రచితమయిన గీతగౌరీశ కావ్యములయందు పదునొకండవ సర్గము ముగిసెను.

## ద్వాదశ స్సర్గః

శ్లో. అథధిర సమాధానం ధ్యానం సమాప్యేము నీశ్వర స్సపది నయనోన్మేషా దీషద్విలోక్య దిశోబహిః। ఝుడితిపురతో దృష్ట్వాస్పృష్ట్వా సుఖాసుఖస్థితం। శివముదుకృపా శిష్టం తుష్టంజగాద కృతాంజలిః॥

తా. కావున యోగీశ్వరుడు యోగసామర్థ్యముచే సదాశివ ధ్యానమును సమాధి నిష్ఠుడై చేయుచుండ నేత్రోన్మీలనము వలన కొంచము బహిర్దృష్టి సంభవించినను సుఖస్వరూపుడగు అధిక దయాశాలియగు యా సదాశివ రూపమునే చూచుచు సుఖముల ననుభవించుచు తుష్టాంతరంగుడై కృతాంజలియై యీ రీతి నుతించుచున్నాడు.

సావేరి రాగేణ గీయతే.

గీ. స్వస్తిసమోస్తు సమ స్తసుసిస్తుత నిస్తులస్తుతగుణవిభవాయ। తుభ్యమసభ్యజనానుప లభ్యమహామహాసేన శివాయ। జయతు హేగౌరీపతే అభయంకురుశంభో॥ ౧

తా. ఓపరమశివ! అసమాన వైభవముగల వాడవుపరమేశ్వరీసహితుడవునగు నీకు నమస్కారము। స్వస్తి సర్వోత్కృష్టముగా వర్తింపుము॥ నాకభయ మొసంగుమా.

గీ. జన్మసుజన్మ కళాసుకళాసకలంవిమలం మమవృత్తం। యత్తవ పదసరసీరుహ దర్శనభాగ్యమభూదనిమిత్తం॥ ౨

తా. శంభో ఏహేతువవలన తమచరణారవిందదర్శనభాగ్యమునాకనిమిత్తముగా సంభవించునో। ఆకారణము వలన। నాజన్మస ఫలమాయెను। నావిద్యస ఫలమాయెను। నాప్రవర్తనము పవిత్రమాయెను.

గీ. భక్తగుణాగుణ గణనవిముగ్ధ తరాఖలు భవతనుకంపా। అపిముఖనా రకనరకీటజలే ప్రసరతిభగిత నిలింపా॥

తా ఓదయానిధీ భక్తులందు గుణాగుణ విచారము చేయకనీదయ గంగవలె సంభవించు చున్నది। చూడు నిర్జల ప్రదేశమందుండు మత్స్యాదులకు వలెసంసార తాపతప్తుడనగు నాయందు నీనిర్హేతుక దయ సంభవించెను గదా. 3

గీ. రచయతియస్తవ బిల్వదళాసన మవిచలభక్తివిశాలం।తస్యసవాసిన్నృపాసనమనుసర దఖిలధరాధిపజాలం॥

తా ఏమనుజుడు స్థిరభక్తిచే తమకు బిల్వదళ సమర్చనము చేయునో, అట్టిప్రుషుడు రాజ్య సింహాసనమును పొంది సామంతరాజుల చేసే వింపబడును. ౪

గీ. యస్య వపదయుగ మనిమేష తయాక్షణ మపిహృది నిదధాతి। తస్యభవానసి షేవ వయూమనుజస్య విదధాతి॥

తా. ఎవడుభ వదీయ చరణారవిందయుగము క్షణమైనరెప్ప పాటు లేనివాడై ధ్యానించునో అతనికి జీవన్ముక్తి నిచ్చుచున్నావు. ౫

గీ. త్వదమిత గుణగణ గణనసుసాంభర భగిత మహాసనాణీ భూషణతామయ తాదపిమునినావరయు వత్తేరివవేణీ॥

తా. ఎవని వాక్కు భవదీయ కల్యాణ గుణగణము వర్ణింపు చుండునో సుహాసినీ శ్రీకి వేణీ ప్రధానంబు వటుల అలదు సామంవ సర్వకు భూషణ రూపుడగును

గీ. కామిత సమధికఫల దః ప్రకృతిః పను పలిరి తవిధిరూచే। భవ తనుజగద వత్తోల్పమతిః శివ ఫల మహమిహయాచే

తా. ఓసదాశివ భక్తజన కామము కంటెనధిక ఫల ప్రదుడని బ్రహ్మదేవుడుపూర్వమన చెప్పెను। కావున। నిఖిల బ్రహ్మాధిపతివైన అధిక ఫలప్రదాతవయిన నీవలనల్పబుద్ధినైన నేనేమి ఫలమును కోరెదను.

గీ. శ్రీకవి రాజ మహీసుర సుధి యావిర చితసద మిలిగీతం। జయవిజయప్రదమి హవిదుషామభివర్ణిత శివగుణజాతం

తా. శ్రీ రాజేశ్వర కవి వర రచితమ గుసదాశివ గీతము। అభివర్ణింపు చుండు విద్వాంసులకు యాపరమేశ్వరుడు జయవిజయముల నొసంగును.

శ్లో॥ ప్రీత్యా హసి ఈక్షణ శ్రీమజు షాసర్వసర్వ దర్శియో స్వాకటా దృశ్యవాతిక్రుపాద్ర్ద యోసర్వయన రూనార్థ భోస్న మేహో విశేః।

శంకాకాపిన చాభవత్తవ మహాబాద్యతాలకూటాశనస్వామిన్ వనచరాచరావన సమారంభాః ప్రియాభావుకాః॥ ౯

తా. ఓపరమ శివబ్రహ్మాది దేవతలు పూర్వ కాలము కాలకూటమునకు భయగ్రస్తులై నీశరణు చెందగనే నిమేవ దహితముగా చూచుచున్న నిదావిహీనమైన సంకట ముపలన భయముచేత అతివ మూర్ఛితులయి నేత్రములందు రెప్ప పాటును దడెలి యీ సందియు మిచుకైన చేయక కాల కూటవిషమును పానముచేసి యావద్బ్రహ్మాండముల సంరక్షించిన శరణాగత రక్షణాది గుణములద్భుతము గదా.

శ్లో. దాస్త్యంభూమి రుపేతిపాదనిహతే హస్తైర్దిశ శస్త్రాడితా ద్యూతిస్ఫార జటాకశాగ్ర నిహతస్తారాగణో రుగ్ణతాం। ఇత్థం ప్రాయతపష దుస్సహతరాటోపః కథం తేజగద్రష్టాస్తత్పర తాండవస్య తవహే దేవస్య వానూగుణాః॥ ౯౨

తా. ఓశంభో ఒకసమయమున నొకఘోర రాక్షసుడు బ్రహ్మాండమును ముంచివేయ ప్రయత్నము చేయుచుండ సర్వజ్ఞుడవగు నీవద్భుత తాండవమునారంభించి చెయిగాప్సాది వ్యాఘ్రశక్తి చెను జటా మండలము చేతాడితములైన సూర్యాదిగ్రహము లునక్షత్రములు తారకములు తాడితము లయ్యెను తద సంతరమున యాదుష్ట రాక్షసుని పాదఘాతముచే సంహరించి సంరక్షించితి వికనుక భక్తవత్సలుడవగు నీమహిమను బ్రహ్మాదులు గూడ గుతియరు.

శ్లో. రాచలోపాఖ్య విఖ్యాతరాజేశ్వర కవీశ్వరః।గీతగౌరీశ కావ్యేస్మిన్ ద్వాదశం సర్గమభ్యధాత్॥

తా. రాచర్ల రాజేశ్వరకవి విరచితమగు గీతగౌరీశ కావ్యమున ద్వాదశ సర్గము ముగిసెను.

స మా ప్తం

గద్య:—

ఇది శ్రీ లేమలవాడ మహాక్షేత్ర నివాస రాజరాజేశ్వర చరణార వింద
సేవా పవిత్ర హారీత.సగోత్ర బ్రహ్మశ్రీ రాజేశ్వరార్య పుత్ర రా
మశాస్త్రిచే యథామతి విరచితమగు శివాష్టపదీమణిప్ర
దీపిక యను ఆంధ్రటీక ముగిసెను. శ్రీ సదాశివ
చరణార విందార్పణ మస్తు శ్రీశివ.

శైవప్రచారిణీ కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | గ్రంథమాల చందాదారులకు. | | | ఇతరులకు | | |
|---|---|---|---|---|---|---|
| | రు | అ | పై | రు | అ | పై |
| 1 కాశీసారము. | 0 | 1 | 3 | 0 | 2 | 0 |
| 2 భద్రాయురుపాఖ్యానము. | 0 | 8 | 0 | 0 | 12 | [illegible] |
| 3 సర్వ్వమధురము. ... | 1 | 0 | 0 | 1 | 0 | [illegible] |
| 4 సరస హృదయానురంజనము | 1 | 8 | 0 | 2 | 0 | [illegible] |
| 5 శైవసిద్ధాంత దర్శిని. ... | 1 | 4 | 0 | 1 | 8 | [illegible] |
| 6 ఉపదేశకాండము, ... | 3 | 0 | 0 | 3 | 8 | [illegible] |
| 7 సంభవకాండము (సంస్కృతం] [తెలుగుటీకతో] | 3 | 0 | 0 | 3 | 8 | 0 |
| 8 సంభవకాండము [వచనము) | 2 | 0 | 0 | 2 | 8 | 0 |
| 9 సోమవార వ్రతోద్యాపనము. | 1 | 0 | 0 | 1 | 8 | [illegible] |
| 10 వీరభద్రాష్టోత్తర శతనామావళి | 0 | 3 | 0 | 0 | 4 | [illegible] |
| 11 వీరభద్ర స్తోత్ర కదంబము | 0 | 8 | 0 | 1 | 12 | 0 |
| 12 విద్యాస్థాన వినిర్ణయము | 0 | 8 | 0 | 0 | 12 | 0 |
| 13 భక్తపాల శతకము | 0 | 1 | 3 | 0 | 2 | 0 |
| 14 శరభాంక లింగశతకము | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 15 అగ్నిముఖం జయాదులు. (సస్వరము.) | 0 | 3 | 0 | 0 | 4 | 0 |

శైవప్రచారిణీ కార్యాలయము.

వరంగల్.